శ్రీ

# దేవీ నవరాత్ర పూజా విధానము



ఓంకారవేద్యా మాదిశక్తిం - లలితాంబా మహం భజే।
త్రైలోక్యజననీం శంభోః - వామార్ధాంగనివాసినీమ్॥

ఓమ్

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

## ఆశీః, శుభాకాంక్షా చ.

ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు.

శైవమహాపీఠాధిపతి.

శ్లో॥ దేవీభక్త్యభివృద్ధ్యర్థం-లోకకల్యాణ హేతవే।
ముద్రాప్యేదం స్తోత్రచయం-మిత్రసాహాయ్యసంయుతః॥ 1
ప్రచారకృత్ భవేదద్య-మల్లికార్జుననామకః।
ముదిగొండ గృహాభిఖ్యో-జ్వాలాలింగాత్మజః సుధీః॥ 2
స్వసంప్రదాయనిరతః-శివశక్త్యర్చనప్రియః ।
వదాన్యః కార్యవాదీ చ-మేధావీ జీవితం స్వకమ్॥ 3
సార్థకం కురుతే ధన్యః-సంభవేచ్ఛివశాసనాత్ ।
అనేన పుణ్యకార్యేణ శైవ శాక్తేయ వర్గకమ్॥ 4
వర్ధతాం భోగభాగ్యాయు-రారోగ్యసుఖలాభతః।
మల్లికార్జునదేవోఽముం-శైవాన్ రక్షేత సంతతమ్॥ 5

# శ్రీ లలితా పంచరత్నమ్

ప్రాతః స్మరామి లలితావదనారవిందం
బింబాధరం పృథులమౌక్తికశోభినాసమ్
ఆకర్ణదీర్ఘనయనం మణికుండలాఢ్యం
మందస్మితం మృగమదోజ్జ్వలఫాలదేశమ్. 1

ప్రాతర్భజామి లలితాభుజకల్పవల్లీం
రక్తాంగుళీయలసదంగుళిపల్లవాఢ్యాం
మాణిక్యహేమవలయాంగదశోభమానాం
పుండ్రేక్షుచాపకుసుమేషుసృణీ ర్దధానామ్. 2

ప్రాతర్నమామి లలితాచరణారవిందం
భక్తేష్టదాననిరతం భవసింధుపోతం
పద్మాసనాదిసురనాయకపూజనీయం
పద్మాంకుశధ్వజసరోరుహలాంఛనాఢ్యమ్. 3

ప్రాతః స్తువే పరశివాం లలితాం భవానీం
త్రయ్యంతవేద్యవిభవాం కరుణానవద్యాం
విశ్వస్య సృష్టివిలయ స్థితిహేతుభూతాం
విద్యేశ్వరీం నిగమవాఙ్మనసోఽతిదూరామ్. 4

ప్రాతర్వదామి లలితే తవ పుణ్యనామ
కామేశ్వరీతి కమలేతి మహేశ్వరీతి
శ్రీశాంభవీతి జగతాం జననీ పరేతి
వాగ్దేవతేతి వచసా త్రిపురేశ్వరీతి. 5

యః శ్లోకపంచక మిదం లలితాంబికాయాః
సౌభాగ్యదం సులలితం పఠతి ప్రభాతే
తస్మై దదాతి లలితా ఝటితి ప్రసన్నా
విద్యాం శ్రియం విమలసౌఖ్య మనంతకీర్తిమ్ .

ఇతి శ్రీ లలితా పంచరత్నం సమాప్తమ్

శ్రీ మాత్రేనమః

# ఏతత్ గ్రంథ ముద్రణార్థము సహకరించిన మహానుభావులు

శ్రీ బి. రామకృష్ణ, జనక్‌పురికాలని సికింద్రాబాదు
శ్రీ వి. భగవత్‌శాస్త్రి, బేగంపేట్ హైదరాబాదు
శ్రీ జి. ప్రసాదరావు, పద్మారావునగర్ సికింద్రాబాదు
శ్రీ ఎస్. బి. దొరబాబు, లక్డికాపూల్ హైదరాబాదు
శ్రీ ఎం. పార్థసారధి, అంబర్‌పేట హైదరాబాదు
శ్రీ యం.వి. మల్లికార్జునరావు, మహేంద్రహిల్స్, సికింద్రాబాద్
శ్రీ టి. సుబ్రహ్మణ్యప్రసాద్, రామాంతపూర్ హైదరాబాద్
శ్రీ సి.ఎచ్. శ్రీనివాససాయి, అశోక్‌నగర్ విజయవాడ
శ్రీ జి.వి. సుబ్బారెడ్డి, రామ్‌నగర్ హైదరాబాద్
శ్రీ పి. లక్ష్మీనారాయణ, ఫత్తర్‌గట్టి హైదరాబాద్
శ్రీ ఎ. సాంబశివరావు, కాచిగుడ హైదరాబాద్
శ్రీ పండితారాధ్య, మైసూర్‌రోడ్డు బెంగుళూరు.
శ్రీ సి.ఎస్. నారాయణరావు, విద్యానగర్ హైదరాబాద్



—ఓమ్—

# శ్రీ దేవీ నవరాత్ర పూజా విధానము

రచన—సంకలనము

**ఆచార్య, శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**

సర్వ మంగళా-శివ-సదనము

(120) 184/ఎ, వెస్ట్ మారేడుపల్లి,

సికింద్రాబాద్ - 500 026. (ఆం. ప్ర.)

శ్రీ ధాతృనామ సంవత్సరము
30 జులై 1996 ఆషాఢ పూర్ణిమ (వ్యాసపూర్ణిమ)

కాపీలు 500
ప్రథమ ముద్రణ

ముద్రణ :

శ్రీ శాంతా ఆర్ట్ ప్రింటర్స్
2-2-1105/37, తిలక్ నగర్
భాగ్యనగర్ - 500 044
ఫోన్ : 4653241

కాపీలకు :

సర్వ మంగళాశివసదనము
[120] 184/ఎ, వెస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్-26

యం. మల్లికార్జునరావు
1-8-700/85, పద్మాకాలనీ, శంకరమఠం దగ్గర,
నల్లకుంట, హైదరాబాద్-44.

# దేవీ నవరాత్ర ప్రమాణములు

శ్రీ దేవీభాగవతే-తృతీయస్కంధే-౨౬అ.

జనమేజయః

నవరాత్రే తు సంప్రాప్తే
కిం కర్తవ్యం ద్విజోత్తమ।
విధానం విధివద్బ్రూహి।
శరత్కాలే విశేషతః॥౧॥

దేవీ విగ్రహమును అష్టాదశభుజగా సింహవాహనగా ప్రతిష్ఠింపవలెను. విగ్రహము లేనిచో నవార్ణమంత్రముతో కూడిన యంత్రమును తత్పార్శ్వమున కలశమును స్థాపించవలెను.

శ్లో॥ అర్చాఽభావే తథా యంత్రం
నవార్ణమంత్ర సంయుతమ్।
స్థాపయేత్ పీఠపూజార్థం
కలశం తత్ర పార్శ్వతః॥౨॥

ఉపవాసము నక్తము ఏకభుక్తము అనువానిలో ఏదేనొక నియమము నవలంబింపవలెను.

కుమారీ పూజనము ఇందు ముఖ్యము। కన్యక ఏకవార్షిక కూడదు. దశవార్షికకన్న పెద్దది పనికిరాదు.

# సప్తవింశాధ్యాయే

ధనధాన్యప్రదం నిత్యం-సుఖ సంతాన వృద్ధిదమ్।
ఆయురారోగ్యదం చైవ-స్వర్గదం మోక్షదం తథా॥౧౭
రాజ్యభ్రష్టేన రామేణ సీతావిరహితేన చ।
కిష్కింధాయాం వ్రతంచైత-త్కృతం దుఃఖాతురేణ వై।౪౯
అష్టమ్యాం మధ్యరాత్రే తు-దేవీ భగవతీ హి సా।
సింహారూఢా దదౌ తత్రి-దర్శనం ప్రతిపూజితా॥ త్రింశాధ్యాయే॥౪౫
సమాప్య తద్వ్రతం చక్రే-ప్రయాణం దశమీదినే।
విజయాపూజనం కృత్వా-దత్వా దానాన్యనేకశః॥౬౦

"అజా మేకాం లోహితశుక్లకృష్ణాం
బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్।
అజోహ్యేకో జుషమాణోఽను శేతే
జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః" శ్వే తాశ్వతరం.

## అభియుక్త సూక్తి

శక్తిః శివశ్చ సచ్ఛబ్ద ప్రకృతి ప్రత్యయోదితౌ।
తౌ బ్రహ్మ సామరస్యేన-సమస్తజగదాత్మకౌ॥

యథా శివ స్తథా దేవీ-యథా దేవీ తథా శివః।
నావయో రంతరం విద్యా-చ్చంద్రచంద్రికయో రివ॥
తస్మాత్సహ తయా శక్త్యా హృది పశ్యంతి యే శివం।
తేషాం శాశ్వతికీ ముక్తి - ర్నేతరేషామితి శ్రుతిః॥



ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః
శ్రీ పార్వతీ రాజరాజేశ్వరాభ్యాం నమః
శ్రీ మహాకాళీ శ్రీమహాలక్ష్మి శ్రీమహాసరస్వతీ దేవతాభ్యో నమః
శ్రీ జగదంబాయైలలితా పరాశక్త్యై నమః

శ్రీ

# దేవీ నవరాత్ర పూజా విధాన వివరములు

గురు శుక్రమూఢము లేనట్టి ఆశ్వయుజ [ఆశ్వీజ] మాసమున శుద్ధ ప్రతిపదనాడు తారాచంద్రబలము సరిపడునట్లు పంచాంగమునందు పరిశీలించి దేవీ నవరాత్ర వ్రతమును ప్రారంభింపవలెను.

ప్రతి దినము ఉదయము మధ్యాహ్నము సాయంకాలము మూడు వేళలయందు లేక మధ్యాహ్న సాయంకాలములలో రుద్రాభిషేకము దేవీ సహస్ర నామార్చనలు చేయవలెను. సప్తశతీ పారాయణము హవనము పూర్ణాహుతి మొదలగువాని నొనర్చుట విశేష విధానమగును. కేవలము అభిషేక పూజాదులను గావించుట సామాన్య విధాన మగును. శ్రీచక్రమునందు గాని, అన్నపూర్ణా, లక్ష్మి సరస్వతీ, శ్రీలలితాత్రిపుర సుందరీ విగ్రహములయందు గాని దేవిని పూజింపవలెను. రుద్రాభిషేకమునకు శివలింగము నంది గణపతి నాగము ఉండవలెను.

ఆశ్వయుజ శుద్ధ ప్రతిపద రోజున ఉదయము మంగళ స్నానము చేసి నిత్య అనుష్ఠానము ఐన తరువాత పరిశుభ్రమైన పవిత్ర స్థలమునందు చతురంగ పీఠము [చౌరంగుపీట] పై కమలాకారముగ ముగ్గు వేసి పసుపు కుంకుమలతో పీఠము నలంకరించియు పీఠమునకు అరటి ఆకులను నాలుగువైపులందు కట్టవలెను. మామిడి ఆకుల తోరణముకు పైభాగమునందు కట్టవలెను పీఠముపైన బియ్యపు రాశిమీద కలశమును స్థాపించవలెను.

నాలుగు వేదములను పఠించుటకు నలుగురు, ఆచార్యుడు ఒకరు ఉండునట్లు ఐదుగురు మంచి బ్రాహ్మణులకు వరణము [వర్ణీ]ల నీయవలెను. మధుపర్కము [నూతన వస్త్రము]ల నీయవలెను. సమాప్తి రోజున యథాశక్తి దక్షిణలను తాంబూల ఫలాదుల నొసగవలెను. ప్రతి దినము సువాసినీ బ్రాహ్మణ భోజనము ముఖ్యము. వీలులేనిచో చివరిరోజున సువాసినీ బ్రాహ్మణు

లకు బంధువులకు బీదలకు అన్నదానము చేయవలెను. ఒక్క బ్రాహ్మణునితో నైన వ్రత విధానము చెప్పించుకొనవచ్చును.

ప్రతి దినము గాని సమాప్తి రోజున గాని కుమారిని పూజింపవలెను. ఇందు కలశ స్థాపన అఖండ దీపారాధనము ప్రధానములైనవి.

యజమానుఁడు పత్నీ సమేతముగ పట్టు వస్త్రములను లేక క్రొత్త బట్టలను ధరించి భస్మరేఖలు కుంకుమబొట్టు పెట్టుకొని స్థిరమైన మనస్సు గలవాడై సంతోషముతో దేవీపూజను ప్రారంభింపవలెను ప్రారంభమునందు సమాప్తియందును మంగళ వాద్య ధ్వని యవసరము. ప్రతి దినము బ్రాహ్మణులు ఋక్ యజుః సామ అధర్వణ వేద మంత్రములను పఠించి రుద్రాధ్యాయము [నమకచమకములు] పురుషసూక్తము శ్రీసూక్తము దేవీసూక్తము అనువానితో అభిషేకము చేయించి మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీ స్వరూపురాలగు ఆదిశక్తియొక్క అష్టోత్తరశత [108] నామములతో పూలపూజ చేయించవలెను. అన్నపూర్ణా సహస్ర నామములతో లక్ష్మీ సహస్ర నామములతో సరస్వతీ సహస్రనామములతో అనఁగా ఒక్కొక్కవేళ ఒక్కొక్క సహస్ర నామములతో కుంకుమ పూజనము చేయించవలెను. లేదా మూడు వేళలయందు లలితా సహస్ర నామములతో పూజింపవచ్చును.

ఉదయమున మధ్యాహ్నమునందును సామాన్యముగ పూజించి రాత్రి వేళల యందు సహస్రనామములచే నర్చించుటయు సమంజసమగును. పంచామృతములు, టెంకాయ, అరటిపండ్లు, పూజా సమయమున నేతి దీపము, కర్పూరము, తమలపాకులు, వక్కలు కుంకుమ, శ్రీగంధము, ఖండశర్కర, ద్రాక్షపండ్లు లేక ఖర్జూరములు మొదలగు వస్తువులు దేవీ పూజనమునకు కావలెను. బెల్లపు పానకము శనగపప్పు చిత్రాన్నము పాయసము అను పదార్థములను దేవికి నైవేద్యములుగ సమర్పింపవలెను. దేవీ పూజనము జరుగునపుడు ముత్తైదువలు వచ్చినయెడల వారిని మరియు కన్యకలను పసుపు కుంకుమలతో తాంబూలముతో సత్కరింపవలెను. సహస్ర నామార్చన మంగళహారతి మంత్రపుష్పము' ప్రార్థన ఐన తరువాత దేవీ భజన కీర్తనలు పఠింపవలెను.

భర్తయనుమతిని భార్య కంకణము కట్టుకొని తోడు ముత్తైదువను కూర్చుండబెట్టుకొని దేవిని పూజింపవచ్చును. భార్యకు వీలులేనిచో పురుషుడైనను కుమారిని ప్రక్కన కూర్చుండజేసి దేవీ వ్రతము నాచరింపవలెను. ఇద్దరికి వీలులేనియెడల ఆచార్యునితోగాని సద్బ్రాహ్మణునితోగాని దేవీ నవరాత్ర కార్యమును చేయించవలెను. ఏకభుక్తము [ఒంటిపూట భోజనము] లేక నక్త భోజనము [పగలు ఉపవాసము చేసి రాత్రి వేళ భోజనము] లేక ఒకపూట ఉపాహారము రెండవ పూట పాలు పండ్లు అనువానిలో

ఏదేని ఒక నియమము నవలంబింపవలెను. బ్రహ్మచర్యమును పాటింపవలెను. కపటము, హింస, అనాచారము, మోసము, కలహము మొదలగు దుర్గుణములను విడనాడి అత్యంత అనురాగ భక్తితో దేవిని పూజించుట వెంటనే ఫలించును. అందరితో ప్రేమగా మితముగాను సంభాషింపవలెను.

ఈ దేవీ నవరాత్ర వ్రతమును ప్రారంభించినది మొదలుకొని జీవితపర్యంతము సాధ్యమైతే ఆచరింపవలెను. లేనియెడల తొమ్మిదివత్సరములు వ్రతము నాచరించి పదియవ వత్సరమున ఉద్యాపనజేసి ముగింపవలెను.

ఉద్యాపనవత్సరమున పూర్వమువలె దేవీ నవరాత్ర విధావముకు గావించి చివరి రోజున తొమ్మండుగురు బాలికలకు ఒక ముత్తైదువకు ఒంటి నిండ క్రొత్త బట్టలు దక్షిణ తాంబూలాదుల నొసంగి దేవీ విగ్రహమును ఊరేగింపుతో గ్రామ ముఖ్య వీధుల యందు తీసుకొని వెళ్ళి స్వస్థలముజేర్చియు నిత్య దేవతార్చనలో నెలకొలిపి ప్రతిదినము పూజించుచుండవలెను. సమాప్తినాడు సువాసినీ బ్రాహ్మణులకు దీనులకు అన్నదానముజేయవలెను.

పుత్రసంతానము, శ్రీమంతము, ఆరోగ్యము, ఆయుష్యము, కీర్తిప్రతిష్టలు, గొప్ప పదవి, పిల్లల యోగక్షేమములు సంకల్పసిద్ధి, కోపతాపములు శమించుటయు, కుటుంబ కలహములు, దాయాద [పాలివారి] వైరము, శత్రుబాధ. ఉపద్రవములు, దీర్ఘవ్యాధులు తటస్థించినను దూరమగుటయు, ఇత్యాది మనోభీష్ట సత్ఫలితములు దేవీపూజనము వలన సిద్ధించును.

ఇందుకు దృఢభక్తి విశ్వాసములు శ్రద్ధయు సదాచారము యజమాన దంపతులకు ముఖ్యములు. సంకటములు సంభవించినచో పూజాసామగ్రి నంతయు ఆచార్యబ్రాహ్మణునకు ఇచ్చి బ్రాహ్మణ గృహమునగాని దేవాలయమునందుగాని ఇతర పవిత్ర స్థలమునందుగాని వ్రతమును పూర్తిగా చేయించవలెను. ఇటు చేయుట తగునా? యని సందేహము కూడదు.

ఈ వివరములు ప్రమాణ సమ్మతములై లోకవిరుద్ధములు కానట్టివని పండితులు పామరులును భావింతురుగాక! ఈ వ్రతమును ఇందు వ్రాయబడిన విధముగా ఆచరించువారికి శ్రీ రాజరాజేశ్వరీదేవి అరిష్టములను తొలగించి అభీష్టముల నొనగూర్చుగాక! ఈ వ్రతము జరుగు స్థలమున ఇరుగు పొరుగున ఆ గ్రామమునను ఆ దేశమునందును లోకకళ్యాణము ఒనగూరుగాక!

ఈ వ్రతమును కోపము లేకుండ చేయించు సద్బ్రాహ్మణులకు శుభపరంపర సమకూరుగాక! ఈ వ్రతవిధానమును దురాశా రహితముగ సౌమనస్యముతో వ్రాసియిచ్చిన వారికి - వెనువెంటనే నిర్దుష్టముగ సర్వాంగ సుందరముగను ముద్రించిపించి ప్రచారము నొనర్చు వారికిని - దీర్ఘాయురారోగ్యభాగ్యవిజయములు భగవతి ప్రసాదించుగాక!

హర! హర! మహాదేవ!

రచయిత

శ్రీరాజరాజేశ్వరీ - లలితాంబా విజయతేతరామ్.

గణపతి ప్రార్థనతో ఉమామహేశ్వరాది ముఖ్యదేవతా స్మరణము తోడను దేవీ నవరాత్ర పూజనమును ప్రారంభింపవలెను.

# శ్రీ దేవీ నవరాత్ర పూజా విధానము

(అంగపూజనముతో - అష్టోత్తరశతనామములతోడను)

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం-శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయే - సర్వవిఘ్నోపశాంతయే॥

ఓం ఓం శ్రీ ఉమామహేశ్వరాభ్యాంనమః లక్ష్మీనారాయణాభ్యాంనమః వాణీహిరణ్యగర్భాభ్యాంనమః భద్రకాళీ వీరభద్రేశ్వరాభ్యాంనమః సిద్ధిబుద్ధి వినాయకేభ్యోనమః శచీపురందరాభ్యాం నమః అష్టదిక్పాలకేభ్యోనమః నవగ్రహేభ్యోనమః ప్రకృతి పురుషాది చతుర్వింశతి తత్త్వేభ్యోనమః ఏకాదశరుద్రేభ్యోనమః ద్వాదశాదిత్య దేవతాభ్యోనమః అష్టవసుభ్యోనమః అశ్వినీదేవతాభ్యాంనమః త్రయస్త్రింశత్కోటిదేవతాభ్యోనమః సప్తర్షిభ్యోనమః దేవర్షిభ్యోనమః నందిభృంగ్యాది మాహేశ్వరేభ్యోనమః గురుభ్యో నమః బ్రాహ్మణేభ్యోనమోనమః. అఖండ దీపారాధనముచేసి "అఖండదీపరూపేణ స్థిత్వా మాం సఫలం కురు, భగవత్యై శివాయై తే మమ భక్త్యా నమోஉస్తు తే" అని ప్రార్థింపవలెను.

"జ్యోతిష్మత్త్యైనమః" అనుచు అఖండ దీపమునకు గంధ పుష్ప దూప దీప నైవేద్యములను సమర్పించి మ్రొక్కవలెను.

## ఆచమనము

1 ఓం శంభవే స్వాహా
2 ఓం శంకరాయస్వాహా
3 ఓం శాంతాయ స్వాహా

ఈ మూడిటిలో ఒక్కొక్క నామమును పఠించుచు కుడి అఱచేతి నుద్ధరిణితో నుదకము వేసికొని పుచ్చుకొనవలెను.

ఓం
4. శాశ్వతాయనమః అనుచు కుడి అఱచేతిని కడుగవలెను.

5. శివ 6. స్థాణో 7. భవానీపతే 8. భూతేశ 9. త్రిపురాంతక 10. త్రిణయన 11 శ్రీకంఠ 12. కాలాంతక 13. శర్వ 14. ఉగ్ర 15. అభవ 16. భర్గ 17. భీమ 18. జగతాంనాథ 19. అక్షయ 20. శ్రీనిధే 21. రుద్ర 22. ఈశాన 23. మహేశ. 24. మహాదేవాయ నమః ఈ ఇరువది నామములను చేతులు జోడించి పఠింపవలెను. విష్ణుభక్తులు-కేశవాది నామములను పఠింపనగును.

## భూతోచ్చాటనము

శో॥ ఉత్తిష్ఠంతు భూతపిశాచాః - యే తే భూమిభారకాః
ఏతేషా మవిరోధేన-బ్రహ్మకర్మ సమారభే॥

అనుచు ఆవాలు తీసుకొని నలువైపులయందు చల్లవలెను.

# ప్రాణాయామము

ఓం భూః ఓం భువః ఓం గ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం గ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥

ఓమాపోజ్యోతీరసోమృతం, బ్రహ్మ భూర్భువః సువరోమ్.

అనుచు చూపుడు వ్రేలు తగులకుండ కుడిచేతి వ్రేళ్ళతో ముక్కు పట్టుకొని లోనికి గాలి పీల్చి విడువవలెను.

# సంకల్పము

శ్రీ శివః శివః పరాశక్తి విశిష్టస్య పరమేశ్వరస్య ఆజ్ఞయా మహావిష్ణోః నాభికమలాదుద్భూయ ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహ కల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య (ఈశాన్య) వాయవ్యప్రదేశే గంగా (కృష్ణా) గోదావర్యోర్మధ్యదేశే స్వగృహే (శివాలయే, నదీతీరే, వసతి గృహే) పవిత్రస్థలే సమస్త దేవతా గురుచరణ మాహేశ్వర బ్రాహ్మణ శివసన్నిధౌ, అస్మిన్ వర్తమానే వ్యావహారిక చాంద్ర మానేన శ్రీ [illegible] నామ సంవత్సరే [illegible] ఆయనే ____

శ్రీమాన్..................గోత్రః   శ్రీమతీ..................గోత్రా ..........................నామధేయః (యా) అహం, (శ్రీమతః) (శ్రీమత్యాః)..................గోత్రస్య (గోత్రాయాః) మమ సపత్నీకస్య సకుటుంబస్య (పతిపుత్ర పరివార సమేతాయాః) ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం క్షేమస్థైర్య విజయ దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థకామమోక్ష పురుషార్థ చతుష్టయ సిద్ధ్యర్థం సత్సంతాన సుఖ సౌభాగ్య ఫలప్రాప్త్యర్థం నవగ్రహారిష్టప్రశాంత్యర్థం సమస్తమంగళావాప్త్యర్థం శ్రీమహాకాళీ శ్రీమహాలక్ష్మి శ్రీమహాసరస్వతీ రూపాం శ్రీ లలితాత్రిపుర సుందరీ పరాశక్తి దేవతా ముద్దిశ్య శ్రీ లలితాత్రిపుర సుందరీ పరాశక్తి దేవతా (శ్రీ అన్నపూర్ణా భట్టారికా (లేక) శ్రీ శారదాదేవి (లేక) శ్రీ రాజరాజేశ్వరీ (లేక) శ్రీ దుర్గా పరదేవతా) ప్రీత్యర్థం శరత్ (వసంత) నవరాత్ర ప్రయుక్తం శ్రీ దేవీసూక్త రుద్రాభిషేక పురస్సరం శ్రీలలితాత్రిపుర సుందరీ దేవ్యాః అష్టోత్తరశత (సహస్ర) నామభిః కుంకుమార్చనం, తదంగ షోడశోపచార పూజనం [సప్తశతీ దేవీమాహాత్మ్య-పఠనంచ) కరిష్యే. అథవా ఆచార్య బ్రాహ్మణైః కారయిష్యే.

తరువాత పృథివీ కలశ గణపతి పూజనము చేయవలెను. పీఠము చెంత అఖండ దీపారాధనము, పూజిత పీఠముపై బియ్యపు రాశి మీద కలశస్థాపన చేయవలెను. శంఖమును గంటను పూజింపవలెను. కలశములో శుద్ధోదకమును నింపి నవరత్నము

లను లేక వగడము ముత్తెము సువర్ణము వేసి కలశముపై టెంకాయ నునిచి కలశమునకు నూతన వస్త్రము చుట్టి టెంకాయ పైభాగమున వట్టుకణుమును మూలమడతగా పెట్టవలెను. కలశమునకు పసుపు కుంకుమలతో అలంకారము చేయవలెను. ఇట్టి కలశమే శ్రీ లలితా త్రిపురసుందరీ పరాశక్తి స్వరూపమని భావింపవలెను. కలశము ముందు దేవీ విగ్రహమును గాని శ్రీచక్రమును గాని నెలకొలిపి మరియొక పళ్లెరమున శివలింగమును, గణపతిని, నందిని, నాగము నుంచవలెను. గణపతి పూజనము తరువాత ఆచార్యునకు బ్రాహ్మణులకును నూతన వస్త్ర [మధుపర్క] ములు తాంబూల దక్షిణలు సమర్పించి ఋత్విజులుగా ఎన్నుకొనవలెను.

## పృథివీ పూజనము

దేవీపీఠము ముందు భూమిపై "పృథివ్యైనమః సర్వోపచారార్థే అక్షతాన్ సమర్పయామి "అనుచు ఉదకమునుచల్లి-కుంకుమాక్షతలు వేయవలెను.

అక్షతలు వేసినచోట కలశమును ఉంచి పూజింపవలెను.

## కలశ పూజనము

శ్లో॥ కలశస్య ముఖే రుద్రః - కంఠే విష్ణుః సమాశ్రితః।
మూలే తత్ర స్థితో బ్రహ్మ - మధ్యే మాతృగణాః శ్రితాః॥
కుక్షౌ తు సాగరాః సర్వే - సప్తద్వీపా వసుంధరా।
ఋగ్వేదోఽథ యజుర్వేదః - సామవేదో హ్యథర్వణః॥
అంగైశ్చ సహితాః సర్వే - కలశాంబు సమాశ్రితాః।
ఆయాంతు దేవీ పూజార్థం - దురితక్షయ కారకాః।

"కలశస్థ వరుణదేవతాయైనమః - గంధాక్షతకుంకుమ పుష్ప బిల్వ పత్రాణి సమర్పయామి, ధూపదీపౌ నైవేద్యం చ సమర్ప యామి, అనుచు కలశమునందలి యుదకములో గంధాక్షతలు కుంకుమ పూలు ఘూరేడుపత్రి వేసి కలశము నలంకరించియు ధూప దీపములను చూపి పంచదార - నైవేద్యము 1 కలశోదకము నందు వేయవలెను. తరవాత కలశముపై కుడిచేతి నునిచి "స్థిరో భవః వరదో భవః శాంతో భవః సుప్రసన్నో భవః మమ అభిసన్ముఖో భవః అని వరుణదేవుని ప్రార్థించి కలశోదకమును పుష్పముతో పూజా ద్రవ్యములపై దేవీకలశ పీఠములపైనను చల్లి తమ పైనను చల్లుకొనవలెను.

## గణపతి పూజనము

శ్లో॥ అగజాననపద్మార్కం - గజానన మహర్నిశం।
అనేకదం తం భక్తానాం - ఏకదంత ముపాస్మహే॥
శ్రీ గణాధిపతయేనమః - ధ్యానం సమర్పయామి ఆవాహ

యామి. ఆసనార్థే ప్రతిష్ఠాపనార్థే చ శుభ్రాక్షతాన్ సమర్పయామి. పాదయోః పాద్యం, హస్తయోః అర్ఘ్యం, ముఖే ఆచమనీయంచ సమర్పయామి (అనుచు మూడు మారులు పుష్పముతో ఉదకము చల్లవలెను.) పంచామృతైః శుద్ధోదకేనచ స్నపయామి. వస్త్రార్థే వస్త్రార్థే కార్పాసవస్త్రం, యజ్ఞోపవీతార్థే అక్షతాన్ సమర్పయామి. భస్మ విలేపయామి. శ్రీగంధం ధారయామి. అక్షతైః సంపూజయామి.

పరిమళసౌభాగ్యద్రవ్యాణి సమర్పయామి. పుష్పైః సంపూజయామి. దూర్వాం [లేక] బిల్వం సమర్పయామి. ధూపం ఆఘ్రాపయామి. దీపం ప్రదర్శయామి. శుద్ధ ఆచమనీయం సమర్పయామి. శర్కరాం నివేదయామి, మధ్యే పానీయం, ఉత్తరాపోశనం హస్తప్రక్షాళనం ముఖప్రక్షాళనం ఆచమనీయం చ సమర్పయామి. తాంబూలం స్వర్ణపుష్పదక్షిణాం ద్రాక్షాకదళీఖర్జూరాది ఫలం సమర్పయామి. మంగళమహానీరాజనం సకర్పూరం సమర్పయామి. మంత్రపుష్పం సమర్పయామి. నమస్కరోమి, ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు.

శ్లో॥ వక్రతుండ మహాకాయ - కోటిసూర్య సమప్రభః
నిర్విఘ్నం కురు మే దేవ - సర్వకార్యేషు సర్వదా॥

"అనేన పూజనేన శ్రీ విఘ్నేశ్వరః ప్రీయతాం" అని యుదకము విడువవలెను.

## పీఠ పూజనము

పూర్వద్వారే-ద్వారశ్రియైనమః, ధాత్రేనమః, విధాత్రేనమః, చిచ్ఛక్త్యైనమః మాయాశక్త్యైనమః శంఖ నిధయేనమః పద్మనిధయేనమః గంగాయై నమః యమునాయైనమః దుర్గాయైనమః గణపతయేనమః క్షేత్రపాలకాయనమః అభయంకరాయనమః వాస్తుపురుషాయ నమః ద్వారోపరి ద్వారశ్రియైనమః

అనుచు పీఠము యొక్క తూర్పున కుంకుమాక్షతలు పది యైదు (15) పర్యాయములు వేయవలెను.

దక్షిణద్వారే - ద్వారశ్రియైనమః చండాయనమః ప్రచండాయనమః చిచ్ఛక్త్యైనమః

అనుచు పీఠమునకు దక్షిణ దిక్కున నాలుగు తడవలు కుంకుమాక్షతలు వేయవలెను.

పశ్చిమద్వారే - ద్వారశ్రియైనమః బలాయనమః ప్రబలాయనమః

అనుచు పీఠపశ్చిమమున మూడుసార్లు కుంకుమాక్షతలు వేయవలెను.

ఉత్తరద్వారే–ద్వారశ్రియైనమః జయాయనమః విజయాయనమః

అనుచు పీఠమునకు ఉత్తరమునందు మూడు మారులు కుంకుమాక్షతలు వేయవలెను.

మధ్యే - ఆధారశక్త్యైనమః మహామండూకాయనమః కూర్మాయనమః వరాహాయనమః అనంతాయనమః అష్టదిగ్గజేభ్యో నమః అనుచు పీఠమునడుమ - ఆరు పర్యాయములు కుంకుమాక్షతలు వేయవలెను.

తన్మధ్యే శ్వేతద్వీపాయనమః శ్వేతద్వీపమధ్యే రత్నమంట పాయనమః రత్నమంటపమధ్యే నవరత్నఖచిత సింహాసనాయనమః నవరత్నఖచిత సింహాసనమధ్యే పరాశక్తిపరమేశ్వరాభ్యాం నమః అనుచు మరల పీఠమధ్యయందే నాలుగుమారులు కుంకుమాక్షతలు వేయవలెను. తరువాత కలశమును పెట్టవలెను. కలశము ముందు ఉంచబడిన శ్రీచక్రమునకు గాని దేవీవిగ్రహమునకు గాని ప్రాణ ప్రతిష్ఠ నొనర్పవలెను. ప్రాణప్రతిష్టకు ముందు విగ్రహమును గాని శ్రీచక్రమును గాని పంచామృతములతో నభిషేకింపవలెను.

## పంచామృతస్నానం

"ఓం ఆప్యాయస్వ సమేతుతే - విశ్వతః సోమవృష్ణియం? భవావాజస్య సంగధే" క్షీరస్నానం సమర్పయామి.

"ఓం దధిక్రావ్ణో అకారిషం, జిష్ణోరశ్వస్య వాజినః, సురభినో ముఖాకరత్ ప్రాణ ఆయూ (గ్)ంషితారిషత్" దధిస్నానం సమర్ప యామి

"ఓం శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవః సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభిః" ఘృతస్నానం సమర్పయామి.

"ఓం మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నః సంత్వోషధీః మధునక్త ముతోషసి, మధుమత్పార్థి

వగ్ం రజః మధుద్యౌరస్తు నః పితా, మధుమాన్నో వనస్పతి ర్మధుమా (గ్)ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతు నః" మధు స్నానం సమర్పయామి.

"ఓం స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే, స్వాదు రింద్రాయ సుహవేతునామ్నే, స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమా(గ్)ం అదాభ్యః" శర్కరాస్నానం సమర్పయామి.

శ్లో॥ మధుకైటభదర్పఘ్నే - ధూమ్రలోచననాశిని।
పంచామృతేన కృపయా - సుస్నాహి గిరిశప్రియే॥

శ్రీ మహాకాళీ-శ్రీ మహాలక్ష్మి శ్రీ మహాసరస్వతీ-దేవతాత్మికాయై శ్రీ లలితాత్రిపురసుందరీ దేవ్యై నమః పంచామృత స్నానం సమర్పయామి.

## ప్రాణప్రతిష్ఠా మంత్రము

ఓం అస్య శ్రీ ప్రాణ ప్రతిష్ఠాపన మహా మంత్రస్య బ్రహ్మ విష్ణుమహేశ్వరా ఋషయ, ఋగ్యజుః సామాధర్వాణి ఛందాంసి, ప్రాణశక్తిః పరా దేవతా ఆంబీజం హ్రీంశక్తిః క్రోంకీలకం, శ్రీమహాకాళీ శ్రీమహాలక్ష్మి శ్రీమహాసరస్వతీ రూపాయాః శ్రీ లలితా త్రిపురసుందరీ దేవ్యాః ప్రాణప్రతిష్టాపన సిద్ధ్యర్థే జపే వినియోగః

ఓం ఆం హ్రీం క్రోం అంకంఖంగంఘంఙం పృథివ్యా పస్తేజోవాయ్వాకాశాత్మనే అం అంగుష్ఠాభ్యాం నమః హృదయాయనమః

ఓం ఆం హ్రీం క్రోం ఇం చంఛంజంఝంఞం శబ్దస్పర్శ రూప రసగంధాత్మనే - ఈం తర్జనీభ్యాంనమః శిరసేస్వాహా

ఓం ఆం హ్రీం క్రోం ఉం టంఠండంఢంణం త్వక్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణాత్మనే - ఊం మధ్యమాభ్యాం నమః శిఖాయై వషట్

ఓం ఆం హ్రీం క్రోం ఏం తంథం దంధం నం వాక్పాణి పాద పాయూపస్థాత్మనే ఐం అనామికాభ్యాంనమః కవచాయహుం

ఓం ఆం హ్రీం క్రోం ఓం పంఫం బంభం మం వచనా దాన విసర్గానందాత్మనే ఔం కనిష్ఠికాభ్యాంనమః నేత్రత్రయాయ వౌషట్.

ఓం ఆం హ్రీం క్రోం ఆంయంరంలంవంశంషం సంహం ళంక్షం మనోబుద్ధ్యహంకార చిత్తజ్ఞానాత్మనే అః కరతల కర పృష్ఠాభ్యాంనమః అస్త్రాయఫట్.

## ధాన్యం

శ్లో॥ రక్తాంభోధిస్థ పోతోల్లసదరుణ సరోజాధిరూఢా కరాగ్రైః-
పాశం కోదండ మిక్షూద్భవ మణిగణ మప్యంకుశం
పంచబాణాన్।
బిభ్రాణాఽసృక్కపాలం త్రిణయనలసితా పీనవక్షో
రుహాఢ్యా-
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరా నః॥

ఓం ఆం హ్రీం క్రోం యరలవశషసహోం దేవీప్రాణాఇహప్రాణా
ఓం ఆం హ్రీం క్రోం యరలవశషసహోం దేవీజీవ ఇహస్థితః
ఓం ఆం హ్రీం క్రోం యరలవశషసహోం పరాశక్తే ఇహాగచ్ఛ

వాఙ్మనశ్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణపాయుజంఘాది సకలేంద్రియాణి అస్మిన్కలశే (యంత్రే విగ్రహేవా) సుఖం చిరం తిష్టంతుస్వాహా మరియు నీ దిగువ మంత్రమును చదువవలెను.

"ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో దేహి భోగం, జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే మృడయా నః స్వస్తి, అమృతం వై ప్రాణాః అమృతమాపః, ప్రాణ నేవ యథాస్థాన ముపహ్వాయతే"

ఆవాహితాభవః స్థాపితాభవః సుప్రీతాభవః సుప్రసన్నా భవ! వరదాభవ! స్థిరాసనంకురు! అనుచు కలశముపై విగ్రహముపై (యంత్రముపై) కుడిచేతినునిచి తీయవలెను.

శ్లో॥ దేవీ సర్వజగన్నాథే - యావత్పూజావసానకం,
తావత్త్వం ప్రీతిభావేన - బింబే కలశే (యంత్రే)ఽస్మిన్
సన్నిధింకురు॥

అని ప్రార్థింపవలెను.

తరువాత శ్రీచక్రమునకు లేక దేవీ విగ్రహమునకు అవసర నివేదనము (శర్కర - లేక - ఫలము) సమర్పింపవలెను.

ప్రతిష్ఠితమగు దేవీ విగ్రహము నందు - లేక శ్రీ చక్రము నందు - లేక కలశమునందు శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మి శ్రీ మహా సరస్వతులను ధ్యానింపవలెను. అనగా మహాకాళీ దేవిని మధ్య నున్నట్లు ధ్యానించి కుడిభాగమున మహాలక్ష్మిని, ఎడమభాగమున మహాసరస్వతిని దిగువ శ్లోకములతో ధ్యానింపవలెను.

## 1. మహాకాళీ ధ్యానము

శ్లో॥ దశవక్త్రా దశభుజా-దశపాదాఽంజనప్రభా।
విశాలత్రింశన్నయనా-భక్తకామవరప్రదా।
స్ఫురద్దశనదంష్ట్రాభిః భీమరూపా దురత్యయా।
రూపసౌభాగ్యకాంతీనాం-సుప్రతిష్ఠా మహాశ్రయా॥
ఖడ్గశూలగదాబాణ-శంఖచక్ర భుశుండిభృత్।
పరిఘం కార్ముకం శీర్ష-నిఃస్రోతద్రుధిరం దధౌ॥
ఏషా సా వైష్ణవీ మాయా.మహాకాళీ మహాప్రభా।
చరాచరవశీకార-దాత్రీ శంభోః ప్రియా పరా॥

## 2. మహాలక్ష్మి ధ్యానము

శ్లో॥ సర్వదేవాధిదేవేభ్యో-ఆవిర్భూతాఽమితప్రభా।
త్రిగుణా చ మహాలక్ష్మీః-సాక్షా న్మహిషమర్ధినీ॥
శ్వేతాననా నీలభుజా-సుశ్వేత స్తనమండలా।
లఘుమధ్యా రక్తపాదా-నీలజంఘోరు రున్మదా।
సుచిత్రజఘనా చిత్ర మాల్యాంబర విభూషణా।

చిత్రానులేపనా కాంతి-రూపసౌభాగ్యశాలినీ॥
అష్టాదశభుజా పూజ్యా-సా సహస్ర భుజా సతీ।
ఆయుధాన్యత్ర వర్తంతే-దక్షిణాధః కరక్రమాత్॥
అక్షమాలా చ కులిశ-మిషుధిః కమలం గదా।
చక్రం త్రిశూలం పరశుః శంఖఘంటే చ పావకః॥
శక్తిర్దండం చర్మ చాపః-పానపాత్రం కమండలుః॥
బాణా శ్చైతై రాయుధై శ్చ-యుతాం వై కమలాసనామ్॥
సర్వదేవమయీ మీశాం-మహాలక్ష్మీం భజే పరామ్॥

## 3. మహాసరస్వతీ ధ్యానము

శ్లో॥ గౌరీదేహసముత్పన్నా-యా సత్త్వైకగుణాశ్రయా।
సాక్షాత్సరస్వతీ ప్రోక్తా-శుంభాసురనిబర్హిణీ॥
దేవీచాష్టభుజా బాణ-ముసలే శూలచక్రభృత్।
శంఖం ఘంటాం లాంగలం చ కార్ముకం దధతీ వరా॥
ఏషా సంపూజితా భక్త్యా-సర్వజ్ఞత్వం ప్రయచ్ఛతి।
నిశుంభమర్దినీ దేవీ-సర్వశోభాతిసుందరీ॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహాసరస్వతీ దేవతాభ్యో నమః. ధ్యానం సమర్పయామి.

"ఓం హిరణ్యవర్ణాం హరిణీం. సువర్ణరజతస్రజాం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ"

శ్లో॥ ఆగచ్ఛ దేవి వరదే - దైత్యదర్పనిషూదిని।
పూజాం గృహాణ సుముఖి - నమస్తే శంకరప్రియే॥
సర్వదేవమయం వారి - సర్వతీర్థ సమన్వితం।
ఇమం ఘటం సమాగచ్ఛ - తిష్ఠ దేవగణైః సహ॥
దుర్గే దేవి సమాగచ్ఛ - సాన్నిధ్య మిహ కల్పయ।
పూజాబలిం గృహాణ త్వ - మష్టాభిః సహ శక్తిభిః।

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మి శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాం శ్రీ లలితా త్రిపుర సుందరీం (లేక) అన్నపూర్ణా భట్టారికాం (లేక) దుర్గాం వరదేవతా మావాహయామి.

అని దేవికి పుష్పాంజలిని సమర్పింపవలెను.

"ఓం తామ్మ ఆవహ జాతవేదో లక్ష్మి మనపగామినీం, యస్యాం హిరణ్యం విందేయం గా మశ్వం పురుషా నహం"

శ్లో॥ ప్రేతాసన సమాసీనే- శ్వేతపద్మాసనస్థితే।
ఆసనం కల్పయామీశే - చాముండే చండ విక్రమే॥

శ్రీ మహాకాళీ శ్రీమహాలక్ష్మి శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాయై శ్రీ లలితా త్రిపురసుందరీ దేవ్యైనమః

నవరత్నఖచిత దివ్యసింహాసనార్థే కుంకుమాక్షతాన్ సమర్పయామి.

ఓం "అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీం। శ్రియం దేవీ ముపహ్వయే శ్రీ ర్మా దేవీ జుషతాం".

శ్లో॥ సురాసురమహామౌళి-మాలామాణిక్యకాంతిభిః।
విరాజిత పదద్వంద్వే పాద్యం దేవి దదామ్యహమ్॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాయై శ్రీ లలితా త్రిపుర సుందరీ-దేవ్యైనమః పాదయోః పాద్యం సమర్పయామి.

ఓం "కాంసోస్మితాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీం, పద్మేస్థితాం పద్మవర్ణాం త్వా మిహోపహ్వయే శ్రియం"

శ్లో॥ అనర్ఘసత్యసంపూర్ణే-ప్రసన్నే ఉనర్ఘవాంఛితే।
అర్ఘ్యం దాస్యామి దేవేశి-మహానర్ఘవరప్రదే॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహాసరస్వతీ దేవతాత్మి కాయై శ్రీ లలితా త్రిపుర సుందరీ దేవ్యై నమః హస్తయోరర్ఘ్యం సమర్పయామి.

ఓం "చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం, శ్రియంలోకే దేవజుష్టాముదారాం, తాం పద్మినీమీం శరణ మహం ప్రపద్యే, అలక్ష్మీర్మేనశ్యతాం త్వాం వృణే"

శ్లో॥ రక్తబీజసముత్పన్నర-త్నాసన సమాశ్రయే।
దదామ్యాచమనం తుభ్యం-భక్తానాం భద్రదాయిని॥

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాయై శ్రీ లలితా త్రిపురసుందరీ దేవ్యై నమః ముఖే ఆచమనీయం సమర్పయామి.

ఓం "ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో-వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః, తస్య ఫలాని తపసా నుదంతు - మాయాఽంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః"

శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మి శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాయై శ్రీ లలితా త్రిపురసుందరీదేవ్యై నమః మధుపర్కం సమర్పయామి. (పెరుగు పంచదార కలిపి కొబ్బరి చిప్పలో సమర్పించవలెను.)

## పంచామృతస్నానం

"ఓం ఆప్యాయస్వ సమేతు తే - విశ్వతః సోమవృష్ణియం? భవావాజస్య సంగధే" క్షీరస్నానం సమర్పయామి.

"ఓం దధిక్రావ్ణో అకారిషం, జిష్ణోరశ్వస్య వాజినః, సురభినో ముఖాకరత్ ప్రాణ ఆయూ (గ్)ంషితారిషత్" దధిస్నానం సమర్పయామి

"ఓం శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవః సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభిః" ఘృతస్నానం సమర్పయామి.

"ఓం మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్నః సంత్వోషధీః మధునక్త ముతోషసి, మధుమత్పార్థివగ్ం రజః మధుద్యౌరస్తు నఃపితా, మధుమాన్నో వనస్పతిర్మధుమా (గ్)ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతు నః" మధుస్నానం సమర్పయామి.

"ఓం స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే, స్వాదు రింద్రాయ సుహవేతునామ్నే, స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమా(గ్)ం అదాభ్యః" శర్కరాస్నానం సమర్పయామి.

శ్లో॥ మధుకైటభదర్పఘ్నే - ధూమ్రలోచననాశిని
పంచామృతేన కృపయా - సుస్నాహి గిరిశప్రియే॥

శ్రీ మహాకాళీ-శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాయై శ్రీ లలితాత్రిపురసుందరీ దేవ్యైనమః పంచామృత స్నానం సమర్పయామి.

## ఫలోదక స్నానం

"ఓం యాఃఫలినీర్యా అఫలా అపుష్పాః యాశ్చపుష్పిణీః, బృహస్పతిః ప్రసూతాస్తానో ముంచంత్వ(గ్)ం హసః"
శ్రీ మహాకాళీ శ్రీ మహాలక్ష్మీ శ్రీ మహాసరస్వతీ దేవతాత్మికాయై శ్రీ లలితా త్రిపుర సుందరీ దేవ్యై నమః నారికేళఫలోదక స్నానం సమర్పయామి.

## శుద్ధోదక స్నానం

"ఓం ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినాసహ, ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్, కీర్తిమృద్ధిం దదాతు మే"

పురుషసూక్తము శ్రీసూక్తము, దేవీసూక్తము, నమకచమములు (రుద్రాధ్యాయము) దశశాంతులు అనువానితో అభిషేకము చేయవలెను. వీలులేనిచో ఒక్క శ్రీసూక్తము మాత్రము చదువుచు దేవికి అభిషేకము చేయవలెను.

## శ్రీసూక్తము

ఓం హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం। చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ। తాంమ ఆవహ జాతవేదోలక్ష్మీ మనపగామినీం। యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహం। అశ్వపూర్వాం రథమధ్యాం హస్తి-నాదప్రబోధినీం। శ్రియం దేవీ ముపహ్వయే శ్రీర్మాదేవీ జుషతాం। కాంసోస్మితాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీం। పద్మేస్థితాం పద్మవర్ణాం [త్వాం] తా మిహోపహ్వయే శ్రియం॥ చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం శ్రియంలోకే దేవజుష్టా ముదారాం। తాం పద్మినీ మీం శరణమహం ప్రపద్యేఽలక్ష్మీ రే నశ్యతాం త్వాం వృణే। ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః। తస్య ఫలాని తపసా నుదంతు మాయా అంతరా యాశ్చబాహ్యా అలక్ష్మీః। ఉపైతుమాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ। ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్, కీర్తి మృద్ధిం దదాతుమే। క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా మలక్ష్మీం నాశయామ్యహం అభూతి మసమృద్ధించ సర్వాం నిర్ణుద మే గృహాత్। గంధద్వారా దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం। ఈశ్వరీ[గ్ం] సర్వభూతానా

త్వా మిహావహ్వయే శ్రియం। మనసః కామమాకూతిం వాచః సత్య మశీమహి। పశూనా[గ్ం] రూప మన్నస్య మయిశ్రీః శ్రయతాం యశః। కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ। శ్రియం వాసయ మేకులే మాతరం పద్మమాలినీం। ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే। ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే। ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీం। చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ। ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీం। సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాత వేదో మ ఆవహ తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీం యస్యాం హిరణ్యం ప్రభూతం గావోదాస్యోఽశ్వాన్ విందేయం పురుషా నహమ్॥

## ఫలశ్రుతి

యః శుచిః ప్రయతో భూత్వా-జుహుయా దాజ్యమన్వహం। శ్రియః పంచదశర్చంచ శ్రీకామః సతతంజపేత్। ఆనందః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః। ఋషయస్తే త్రయః పుత్రాః స్వయం శ్రీరేవ దేవతా। పద్మాననే పద్మ ఊరూ - పద్మాక్షీ పద్మసంభవే। త్వం మాం భజస్వ పద్మాక్షి - యేనసౌఖ్యం లభామ్యహం। అశ్వదాయిచ గోదాయి - ధనదాయి మహాధనే। ధనం మే జుషతాం దేవి - సర్వకామార్థసిద్ధయే। పుత్రపౌత్ర-

